Regd No. N. 45 / M 3815

వెల ఒక అణా

★ ఏమేనియా, హంగేరీల కీచులాట ★




★ స్పెయినును యుద్ధంలో దించుయత్నము ★

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం|| భాద్రపద బ|| ౧౦ (౨౧-౧౨-౧౩౪౯ఫ.) గురువారము సంచిక ౮౧

# ఇండోచైనా సేనలతో జపాను సేనల పోరాటము

## జపాను, ఫ్రాన్సులకు ఒడంబడిక కుదిరినది

### ముందుగా ఇండోచైనాలోకి జపాను సేనల ప్రవేశము

ఇండోచైనాలోగుండా చైనాలోకి జపాను సేనలను పోనీయవలెననియు, ఇండోచైనాలో తమసేనలకును, విమానాలకును, నౌకలకును ఆశ్రయస్థానాలు నీయవలెననియు, దీనికి సమాధానము సెప్టెంబరు ౨౨వ తేది అర్ధరాత్రిలోగా తెలియజేయవలెననియు, జపానువారు ఇండోచైనా ప్రభుత్వమువారికి సెప్టెంబరు ౧౯వ తేది అంత్యసందేశము నిచ్చియుండిరికదా? ఆసందేశపు గడువుతీరకముందే ౨౨వ తేది అర్ధరాత్రికి ౨గం టలుముందుగా జపాను సేనలు ఇండోచైనాలోకి దాడివెడలినవి. ఫ్రెంచిసేన రెండుగంటలసేపు జపానీయులను ఘోరముగా ప్రతిఘటించినవి. ఇంతలో ఆరేరాత్రి జపానువారికిని ఫ్రెంచివారికిని ఒడంబడిక కుదిరెను. ఆసంగతి వెంటనే దక్షిణచైనాలోనున్న జపానుసేనల అధికారికి తెలియజేయబడెను. అప్పుడుఆయధికారి తనసేనలను పోరాటము మాన్పించి వెనుకకు మరలించెను.

ఒడంబడిక షరతులలోని అంశాలు

ఈ ఒడంబడికప్రకారము జపానువారు టాంకింగు అనుచోట ఉచితముగా విమానాశ్రయముల నుంచుకొనవచ్చుననియు. ౬వేల మంది జపానుసైనికులను హాటిరక్షణకై ఉంచుకొనవచ్చుననియు, జపానుసేనలు దక్షిణచైనానుండి ఇండోచైనాగుండా ఒకనిర్ణీతమార్గమున పోవచ్చుననియు, హైఫాంగులో కొంతసేనను జపానువారుంచుకొనవచ్చుననియు తెలియుచున్నది.

ఒడంబడిక కుదుర్చుకొనుటకై ఉభయపక్షములమధ్యఅగుచుసాగుచుండెను, సెప్టెంబరు౨౨వ తేదినాడు అగినసంభాషణలు తిరిగి మరునాడు ప్రారంభించబడెను. ఒడంబడిక కుదురునో లేదో యను అనుమానముతో ఇండోచైనాతో యుద్ధముచేయవలెనని వచ్చునో ఇండోచైనాయందలి తమ జనులకు నష్టములు కలగకుండుటకై, ఆజనులను జపానుకు పంపించివేయుటకు హైఫాంగు సైగానులకద్ద ఓడలు సెప్టెంబరు౨౧వ తేదినాడు సిద్ధముగా నుంచబడియుండెనట

అమెరికాకు ఫ్రాన్సు విజ్ఞప్తి

ఇండోచైనాపై జపానుదండెత్తుటవల్ల అమెరికా విదేశాంగ సంబంధములలోచిక్కులు కలుగునని అమెరికాప్రభుత్వాభిప్రాయము. అందుచే ఆట్టి అమెరికా తనకేమైన తోడుబడునేమోఅని ఫ్రాన్సు ప్రభుత్వమువారు ఆగస్టు ౨౨వతేదిన కోరిరి కానిఅమెరికా సహాయానికి వచ్చేటట్లు కనపడలేదు. జపానుకోరికలను తాము నిరాకరించజాలమని ఫ్రెంచిప్రభుత్వము వారుపైకిచెప్పెనను, వాస్తవములో తూర్పు ఆసియాఖండ ప్రాంతములో జపాను యొక్కగొప్పతనమును అంగీకరించకతప్పినదికాదు. అందుచే జపానును సంతృప్తిపరచిన పుటికిని ఇండోచైనాలో ఫ్రాన్సుఅధికారము భద్రముగానుండా యుండేటట్లు ఏదైనా ఒడంబడికను జపానుతో కుదుర్చుకోవలెనని ఫ్రెంచి ప్రభుత్వమువారు పలుదిగ్గుమైన సంభాషణలను సాగించిరి.

ఇంకొకవైపు జపానుసేనలు ఇండోచైనామీదికి దండెత్తివచ్చుచో చైనావారును, ఫ్రెంచివారునుకలిసి ఏమిచేయవచ్చునను విషయమై చంగ్ కింగ్ లో చైనాప్రతినిధులకును, ఫ్రెంచిప్రతినిధులకును, సంభాషణలు జరిగినట్లొకవార్తవచ్చినది. కాని చైనా ఫ్రాన్సులకు ఎట్టిఒడంబడిక గానికుదిరినట్లుకానరాదు.

మరల పోరాటము

ఇంతలో మరల సెప్టెంబరు ౨౪వతేది మధ్యాహ్నమునుండి ౨౫వతేదిపగలు ౧౧ గం ల వరకు ఇండోచైనాసరిహద్దులో జపాను, ఫ్రెంచిసేనల కుపోరాటము జరుగుచుండెను. జపానుసేనలు ఫ్రాన్సుతో జపానుకుదుర్చుకొనిన ఒడంబడికనతిక్రమించి, చైనా మీదుగా ఇండోచైనాలోకి ప్రవేశించినట్లును, అందుచే ఫ్రెంచిసేనలు ప్రతిఘటించినట్లును వార్తవచ్చినది. లాంగ్ సంక్ ప్రాంతంలో ఈపోరాటముజరిగెను. జపాను విమానము ఫ్రెంచివారి సేనలమీదను విమానాశ్రయాలమీదను బాంబులువేసెను. ఫ్రెంచివారు రెండువిమానాలనుకూల్చివేసిరి. సరిహద్దులోనుండు ఫ్రెంచి స్త్రీలు శిశువులు ఇపుడు అక్కడినుండి పంపించివేయబడుచున్నారు. ఈ వ్యవహారము చూడగా జపాను ఆమాటచెప్పి, ఈమాటచెప్పి ఇండోచైనాదేదిగ్రమింగదలచినట్లున్నది.

తాయిలాండు బెదరింపు

తాయిలాండు (సయాము)కును ఇండోచైనాకును సరిహద్దును తాయిలాండుకు ఎక్కువప్రదేశమువచ్చునట్లు మార్చవలెనని తాయిలాండు ప్రభుత్వమువారు ఫ్రాన్సును కోరుచున్నట్లువినియుంటిమి, ఇండోచైనా లావ్ రాష్ట్రము ఒకప్పుడు తాయిలాండుకు చేరినదై యుండెను. దానినితిరిగి తనకిచ్చివేయవలసినదని తాయిలాండుకోరిక ఈకోరికనుకోరుటకుజపానువారే ప్రేరేపించియుందురని కట్టితఅనుమానముగలదు. తాయిలాండువారు ఫ్రాన్సుపైకి సేనలనుపంపుదుమని పోయినజూను ౧౨వ తేది ఒకఒడంబడికను తమప్రతినిధులద్వారాకుదుర్చుకొనియుండిరి. దానినింకను తాయిలాండు ప్రభుత్వమువారు ధ్రువపరచలేదు ఫ్రెంచిప్రభుత్వమువారిపుడు ఇండోచైనాలోనుండి తమపూర్వప్రదేశమును తమకిచ్చివేయనిచో ఆఒడంబడికను ధ్రువపరచకరద్దుచేసెదమని బెదరించుచున్నారు.

తాయిలాండునకు జపానుకును మైత్రికలదు తాయిలాండునుండి ఆదేశరక్షణశాఖయొక్క ఉపమంత్రిగారి అధ్యక్షతలో ఒకమిత్రసంఘము జపానుకు ఇపుడుచేరియున్నది దీనిఉద్దేశ్యము జపాను. తాయిలాండుల మైత్రిని బలపరచుటయని చెప్పుచున్నారు, అంతరంగముగా జపానువారు తాయిలాండునూడ యిపుడే ఇండోచైనామీదకి సేనలను పంపవలసినదని పురికొల్పుటకై ఆసంఘమును పిలిపించియుందురని ఊహించుటకు అవకాశములు కలవు.

అమెరికావారు సింగపూరునిత్తురా?

జపాను ఆటలను నిరాటంకముగా సాగనిచ్చుచో పసిఫిక్ సముద్ర ప్రాంతమందంతటను జపానుప్రాబల్యము విజృంభించగలదు, ఇదిఅమెరికావారికి కంటకమే అమెరికావారు బ్రిటిషువారే జపాను ప్రాబల్యమును నిరోధించుటకు తగుసాధనములు కలిగియున్నారు. కాని బ్రిటిషువారు ... ఐరోపా పోరాటములో దూరప్రాంత్య వ్యవహారాలపై శ్రద్ధ చేయిచేసుకొనలేకయున్నారు. అందుచే అమెరికావారే స్వయముగా జాగ్రత్తపడవలసి, అందుకు ఏమేమి ఏర్పాటుచేయవలెనను విషయములో విపరముగా బ్రిటనుతోను, ఆస్ట్రేలియాతోను ఆలోచించుచున్నారు. అమెరికాపక్షమున కార్డెల్ హల్ గారును, బ్రిటనుపక్షమున లోథియన్ గారును, ఆస్ట్రేలియాపక్షమున కాసే గారును అమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వ కేంద్రస్థానమగు వాషింగ్టనులో ఆలోచనలు చేయుచున్నారు. ఈఆలోచనలలో ఒకముఖ్యాంశము ఇపుడు బ్రిటిషువారివశములోనున్న మలేదీపకల్పములోని సింగపూరు రేవుకు అమెరికావారి యుద్ధనౌకలను నిల్పుకొనుటకు బ్రిటిషువారు అనుమతించుటను గూర్చినది. ఇట్లు అనుమతించునని తోచుచున్నది.

## బ్రిటనుపై జర్మనీవిమానాలు

ఇంతవరకు బ్రిటనుపై జర్మనీ విమానాలు సంచరించుచు బాంబులువేసినందువల్ల జర్మనికిచేకూరినప్రయోజనమేదిగాని గణించదగినట్టిదికానరాదు, బ్రిటిషువారు చేయుచున్న యుద్ధసన్నాహమును నాశనముచేయునుద్దేశ్యమే ప్రధానమైయుండును, కాని, ఒకనెలరోజులుగా బ్రిటనులోఅంతటనుతిరిగిచూచి సెప్టెంబరు ౨౧వ తేది న్యూయార్కునుచేరిన అమెరికా సేనలప్రధానాధికారికి సహాయకుడగు బ్రిగేడియర్ జనరల్ జార్జ్ స్ట్రాంగు గారు బ్రిటనులో సైనికప్రాముఖ్యముగలవాటికి గొప్పనష్టముకలుగలేదని చెప్పినాడు, ఇపుడు ఫ్రాన్సుకును ఇంగ్లాండుకునుమధ్యనుండు సముద్రదేశమునందు తుపానుగాలులు, మబ్బులు, వర్షము విజృంభణగలిగియున్నవి ఇవిజర్మనులదాడులకు అంటకములు అందువల్ల సెప్టెంబరు౧౯వతేదినుండి ఈదాడులవార్తలలోగొప్పవిశేషములేవియులేవు.

ఇంతవరకు బ్రిటనుపై దాడులలో ఉభయపక్షాలవారి విమానాల నష్టాలిట్లున్నవి:—

| తేది | జర్మనీ. | బ్రిటను |
| --- | --- | --- |
| ౧౯-౯-౧౯౪౦ | ౫ | ౦ |
| ౨౦-౯-౧౯౪౦ | ౪ | ౭ |
| ౨౧-౯-౧౯౪౦ | ౨ | ౦ |

పెద్దతుపాకుల దెబ్బలు

ఫ్రాన్సు సముద్రతీరములో జర్మనులుస్థాపించిన పెద్దతుపాకులనుండి గుండ్లను ఇంగ్లాండు సముద్రతీరమందలి డోవరుపైకి సెప్టెంబరు ౨౨వ తేది ప్రేల్చిరి.

అదనపురక్షణపు యేర్పాటులు

లండనులో విమానదాడులనుండిజనులనుకాపాడుటకు ఇంకను క్రొత్తరక్షణస్థానములను ఏర్పాటుచేయుచున్నారు, జనులకు సరిపోవునంత ఆహారమును బీదవారలకు కూడులభించునంతచౌకగరలకు లభింపజేయుటకును అధికారులు శ్రద్ధవహించియున్నారు. విమానములను ఇంకను ఏక్కువగా ఉత్పత్తిచేయుటకు మంత్రులు ప్రోత్సాహముచేయుచున్నారు.



## ముసల్మాను యువకమహాసభ

### నవాబ్ బహద్దర్ యార్ జంగ్ బహద్దర్ గారి అధ్యక్షత

మదరాసునగరమందు సెప్టెంబరు ౨౨వ తేది ఉదయము నవాబు బహదర్ యార్ జంగు బహద్దరుగారి అధ్యక్షతలో ముసల్మానయువక మహాసభజరిగెను

బహాదరుయారుజంగుగారు ఉపన్యసించుచు కాంగ్రెసువారు సంస్థానములలో తిరుగుచు ప్రజలలో ప్రబోధము కలిగించుచున్నారు, ముస్లింలీగువారు ఇంతవరకు సంస్థానవ్యవహారాలలో జోక్యము కల్పించుకొననందువలన అఖిలభారతసంస్థానముల ముస్లింలీగును ఏర్పాటు చేయవలసివచ్చెననియు, తానుచేసిన సంచారములో బ్రిటిషు యిండియాలో ముసల్మానుల కెన్నికష్టములుండెనో సంస్థానములలోని ముసల్మానులకు కూడ అన్నికష్టములుండెనని కనుగొంటిననియు, ఇపుడు అఖిలభారత సంస్థానాలముస్లింలీగు చేసెడి పనివల్ల చాలప్రయోజనము కలుగగలదనియు చెప్పిరి.

మతవిద్వేషసమస్య ఏర్పడుటకు కారణము భారతదేశమునేలిన ముసల్మానురాజులు తమవిధిని సరిగా నెరవేర్చియుండినచో యీ సమస్యఉదయించియుండెడిదేకాదనిరి. వారలు చాలసహనము కలిగియుండిరి. ముసల్మానురాజులు హిందువులకును, హిందువుల దేవాలయములకును జాగీరులను ఇచ్చినట్లు చరిత్రాధారములుకలవు, హైదరాబాదులో ప్రభుత్వమువారు మసీదులకంటె హిందువులదేవాలయములకే ఎక్కువసహాయము చేయుచున్నట్లు తానెరుగుదుననిఅధ్యక్షులవారుచెప్పిరి. అయినప్పటికిని ముసల్మాను సంస్థానములకు వ్యతిరేకముగా చాలప్రచారము చేయబడుచుండుట విచారకరమనిరి. ఇస్లాంమతములోకి జనులను చేర్చు ఉద్యమమును గూర్చి గోరంతలు కొండంతలుగ చేయుచున్నారు. తానుకూడ ఆఉద్యమములో పనిచేసియుంటిననుచు బహదర్ యార్ జంగు గారు బలాత్కారముగ ఎవరినైనను చేర్చుకొనినట్లు ఒకనిదర్శనమును చూపవలసినదని సవాలుచేసిరి. ముసల్మానులు భారతదేశమునకు వర్తకులుగను పరిపాలకులుగను వచ్చి ఇచటనే నిలబడిపోయి, తామీదేశములోనివారలమే నను చు ... వారలకు ఈదేశమునకు లేచిపొమ్మనుట తనకు ఆశ్చర్యము గనున్నదనిరి.

మాంటాగ్యూ చెమ్స్ఫర్డ్ రాజ్యాంగసంస్కరణముల కాలమువాటివరకు హిందూముసల్మానులు సామరస్యముతోనుండిరిగాని, ఇపుడు భారతీయులకు స్వరాజ్యమివ్వవచ్చుసరికి ఉపద్రవమంతయు వచ్చుచున్నదనిరి

తుదకు అధ్యక్షులవారు ముసల్మానుయువకులు మతభేదముల విడనాడి ముసల్మానులైనను మనము కాపాడగల ఏకైకసంస్థయగు ముస్లింలీగులో చేరవలసినదని ప్రబోధించిరి.

తీర్మానాలు

మధ్యాహ్నము సభవారుకూడ కొన్నితీర్మానముల నామోదించిరి మైసూరు మహారాజాగారి మరణముపట్ల విచారము తెలుపుటకును, తురకలకు సెకండరీ స్కూళ్లలో చదువుకున్నాలో చెప్పించవలెనని కోరుటకును తీర్మానించబడెను.

హైదరాబాదుసంస్థానములో గొప్పసేనను ఉంచవలెనని, ఆయుధములను మందుసామగ్రిని తయారుచేయుచుండవలెననియు, హైదరాబాదు ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంఘము నాయకులోకరిదానిని బలపరచుచుతీర్మానమొకటి ఆమోదించబడెను, ఇదేవిధముగా హైద్రాబాద్ సంస్థానమునకు ఒకప్పుడు చెందియుండిన దత్తమండలములను బేరారును, ఉత్తరసర్కారులను మరలహైద్రాబాదు సంస్థానములో చేర్చవలెనని ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంఘమువారు కోరినకోరికకూడ బలపరచబడెను.

సెప్టెంబరు ౨౨వ తేది ఉదయము సభవారు సమావేశమై మదరాసు రాష్ట్రములోని ముసల్మాను రాజకీయసంస్థలన్నియు అఖిలభారత ముస్లింలీగులో కలిసిపోవలెనని కోరుతీర్మానము ఆమోదించబడెను. ఇట్టితీర్మానము నామోదించినందుకు అధ్యక్షులవారు ముసల్మానయువకులను ప్రశంసించుచు ఉపన్యాసమును గావించిరి ... సంతోషకరమైన సమస్యలతో సభసమాప్తమయ్యెను.

లండనులో విదేశీయులు

లండనులో బెల్జియం దేశపు ప్రభుత్వపురాయబారి కార్యాలయముపైనను ఒకదాడిలో బాంబులుపడినవి. జపానుకార్యాలయమును అధికారులు ఖాళీచేసిరి. లండనులో ఇపుడు పోలెండు, జెకోస్లోవేకియా, హాలెండు ప్రభుత్వములును, ఫ్రాన్సుదేశ స్వాతంత్ర్యోద్యమదీక్షితులగు కొందరు ఫ్రెంచిజాతీయులునున్నారు. వారలు బ్రిటనులోనున్న తమ తమ జాతివారలను నిర్బంధసైనికశిక్షణ ... వదలబడినారు కాని ఎవరైనను ఇష్టపడనిచో వారలను న్యాయస్థానములో శిక్షింపజేయుటకు బ్రిటిషుప్రభుత్వమునకు అధికారములేదు అట్టిఅధికారమునిచ్చు శాసనమొకటి బ్రిటిషుపార్లమెంటులో ప్రవేశపెట్టబడనున్నది

నౌకావిఘాతములు

సెప్టెంబరు ౨౧వ తేది సాయంకాలము డెన్మార్కు ఉత్తరభాగమున కెదురుగా సముద్రమునందు "స్వర్డ్ ఫిష్" అను ఒక బ్రిటిషుజలాంతర్గామి టార్పెడో ప్రయోగముచే జర్మనీకిసరకులనుగొనిపోవుచుండిన ఒక ఓడనుముంచెను.

కెనడాకు బ్రిటనునుండి బాలబాలికలను తీసికొనిపోవుచుండిన ఒకఓడ టార్పెడోదెబ్బచే సముద్రములో నిగెను. పిల్లలు సెప్టెంబరు ౨౨వ వారములో బయలుదేరిరి సెప్టెంబరు ౧౮వతేది ౧౦గం లకు ఓడమునిగెను మొత్తము ౨౯౪ మంది నీటమునిగిపోయినట్లు లెక్కలు తేలినవి.

"వండీ" అను బ్రిటిషుఓడ ఒకార్మనుయూబోటుచే వేయబడిన టార్పెడోదెబ్బతగిలి మునిగెను. సెప్టెంబరు ౨౦వతేదినాడు స్పెయినువారి ... ఇటలీవారి జలాంతర్గామివేసిన టార్పెడోదెబ్బచే స్పెయినువారియొక్క తీరమునకు దూరముగా సముద్రములో మునుగెను.

... సందేశము

సెప్టెంబరు ౨౨వతేదినాడు బ్రిటిషు ... లో ... సందేశమునిచ్చిరి. అందులో బ్రిటనురక్షణకై తోడ్పడుచున్న సైనికులను, పోలీసులను, సివిలియనులను మెచ్చుకొని ... బ్రిటనుకు ... తోడ్పడుచున్నారనిరి.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర. భాద్రపద బ॥ ౧౦

గురువారము


## గులామీ సంస్కృతి

ఏ మతము ఇతరమతాలకు దాస్యముచేయునో దాని సంస్కృతికి వినాశనమే కలుగును. ఏభాష యితరభాషల క్రింద ఆడపాపగా నుండునో దాని సంస్కృతి వినాశనమగుచున్నదన్న మాట. ఏజనుల భావాలు దాస్యమానసముతో [ Slavish mentality ) కూడియుండునో వారి సర్వసంస్కృతి-నాశనమగుచున్నదనియే గుర్తింపవలెను. గ్రీకుల మతము సంస్కృతినాశనమయ్యెను. రోముల సామ్రాజ్యము మతము, సంస్కృతి నాశనమయ్యెను. మిశ్రదేశపు (ఈజిప్టు) భాష, మతము, సంస్కృతి నాశనమయ్యెను. బాబిలోనియా భాష, మతము, సంస్కృతి ధ్వంసమయ్యెను. ఫినీషియా, ఖాల్డియాలు నామమాత్రావశిష్టముగానైనను ఉండకపోయెను. ఈరాన్ (పర్షియా) దేశపు అహురమజ్దామతము ఆదేశములో గుర్తు కూడా లేకుండా మంటగలిసెను. ఇట్టివింకను ఒకటికాదు, పదికాదు, వందలకొద్దిచూపించగలము. కేవల ప్రసిద్ధదేశములను మాత్రమే ఎత్తిచూపించినాము.

హిందూస్థాన మెల్లప్పుడును దైన్యస్థితిలోనే యుండుటకు అనేక కారణాలున్నవి. అందులో భాషాసమస్య ఒక ముఖ్యకారణం. దేశములో బహుభాషలున్నవి. వాటికి రాజావలంబనము విశేషకాలము లభించలేదు. కొంతకాలము సంస్కృతము రాజ్యము చేసెను-తర్వాత ప్రాకృతాల స్వరూప మేర్పడిన కాలంలో విదేశ దండయాత్రలు మొదలయ్యెను. మొగలుకాలములో ఫార్సీ రాజభాషయు సర్కారీ కచ్చేరీభాషయు అయ్యెను. ఇంగ్లీషువారి కాలములో ఇంగ్లీషు రాజభాషయయ్యెను.

ఇకముందు హిందీయో ఉర్దూయో రాష్ట్రభాషకావలెననిపరస్పరంగా పందెంవేసుకొని పరువులెత్తుచున్నవి. ఉర్దూ, హిందీ రెండునూ భిన్నభాషలని ఉభయులు కొట్లాడుకొనటచేత వ్యక్తమగుచున్నది. మొదట పేరుపైననే ఇద్దరికిని గ్రుద్దులాట. ఇక లిపిలో ఒకరిమార్గం పడమట, ఇంకొకరిదితూర్పు. శబ్దజాలవిషయములో ఒకరు అరబీ ఫార్సీపదాలను ఏరి కూర్చికుప్పించుతారు. ఒకరు సంస్కృత శబ్దాలను లాగుకొనివచ్చి ప్రయోగింతురు. ఈరెండును తగవులాడుచుండుటలో ఏదియు భావిరాష్ట్రభాషకాజాలదని స్ఫురించుచున్నది. అయితే గతవారం హైదరాబాదు నగరములో జరిగిన ఉర్దూప్రచారక సభలో ఉర్దూచక్రవర్తులభాష అని ఒక ఉత్సాహి ఉపన్యసించియుండెను. అతనికి చరిత్రతెలియదు. ఔరంగజేబు చక్రవర్తి కాలంవరకు చక్రవర్తులభాష ఫార్సీ అని అందరికిని తెలియును. అతని కుమారులును పార్సీలోనే సనదులిచ్చిరి. అతని మనుమని కాలంలో మొగలుసామ్రాజ్య పతనమయ్యెను. మరి ఉర్దూకు ముఖ్యమొగం ఏర్పడినది షాజహాన్ కాలములోనే అని ఉర్దూభాషాచరిత్రకారులే వ్రాసినారు. ఉర్దూ సామాన్యజనుల భాషగానే యుండెననుట సమంజసము.

గతవారం జరిగినసభలో ఇట్టి విచిత్ర ప్రసంగాలు చాలాజరిగినవి. ఉర్దూలో దర్జా ఉన్నదని, రాజకీవి ఉన్నదని ఇతరభాషలలో గులామీ వాసనవస్తున్నదని ఒక ఉత్సాహి సభారంగముపై ముచ్చటగా చెప్పెను. ప్రతివాడును తన భాషను ప్రేమించుకొనును. కాకికికాకిపిల్ల ముద్దు. ఒక అరబ్బు ఇట్లుపలికెనని ఒక ఆభాణముకలదు. "అరబీభాష అమృతం, ఫార్సీ తేనె, ఉర్దూ ఖండశర్కర. తక్కిన భాషలన్నియు నాబంటు కాలిక్రింది దుమ్ము." ఒక మహారాష్ట్రుడిట్లనుకొన్నాడట. "ఆరె అరుసు, కనడీ బిరుసు, తెలుగు సరసు" (మరాటీ రాజభాష, కన్నడం మోటు, తెలుగు సరసం) అయితే ఇవన్నీ సత్యమని ఒప్పుకొనవలసినదేనా? స్వకీయాభిమానంతో చెప్పుకొన్న విషయాలలో అసత్యమున్నా, అతిశయోక్తియున్నా, పరనిందఉన్నా అవి క్షంతవ్యములు. ఈనాడు ఉర్దూమాట్లాడేవారున్నా అందరితోపాటుగా గులాములే ఇతర భాషలలో గులామీవాసనవస్తే ఎక్కువ గులాములు మాట్లాడే ఉర్దూలో ఎక్కువ గులామీవాసన వస్తుంది. అంతే!

ఇతరులమాటలెట్లున్నా మొన్నటిసభలో భావినోబిల్ బహుమాన గ్రాహియగు డాక్టర్ రజీయుద్దీన్ సిద్దీఖీగారు చెప్పిన కొన్నిభావాలు గమనింపదగినవైయున్నవి. "మన జనులు స్వభాషను వదలి పరభాషలకు ప్రాముఖ్యమిచ్చుట గులామీఫలితము" అని వారు సెలవిచ్చినారు. ఉర్దూ మాతృభాషగలవారు ఇంగ్లీషుపై వ్యామోహంకలవారైనను తెనుగు మాతృభాష కలవారిలో ఉద్యోగకాంక్షులు బ్రిటిషుఇండియాలో ఇంగ్లీషునున్నా, కాంగ్రెసువారిపై అభిమానం కలవారు హిందీని నేర్చుకొనుచున్నారు. తెలంగాణా తెనుగువారు ఉర్దూను, ఇంగ్లీషును నేర్చుకొనుచున్నారు. ఉర్దూకు పుష్టికలుగుటకై ఫార్సీకూడా నేర్చుకోవలసివచ్చినది. ఈలెక్కప్రకారం చూచిన తెనుగువారు గులాములలో గులాములు. పెద్దగులాములు. కారణమెట్టిదైనా సిద్దీఖీగారు మాతృభాషా ప్రాముఖ్యతనుగురించి ఇచ్చిన అభిప్రాయమును తెనుగువారు బాగుగా గ్రహించవలెను. మొదలు తన మాతృభాషను పరిపూర్ణముగా బాగుగా నేర్చుకొనవలెను. తర్వాత విజ్ఞానకోరువారు ఒకటి రెండు పరభాషలను నేర్చుకొనవలెను. ఈ విధంగా నేర్చుకొన్న అది గులామీ కానేరదు.

హైదరాబాదులో ఇంతవరకే బాగుగా ఉర్దూ వ్యాపించెనది. ఇంకేమైనా వ్యాప్తి సడలిపోతుందేమోనని మొన్నటిసభలో వంటిపెషలను ఉర్దూవాదులు వేయుచున్నారు. అయితే ఇతరభాషలవారి హక్కులు కూడా, నూటికి ౯౦ వంతున నుండు ఉర్దూరానివారి అవసరాలుకూడా, చూడవలెనాలేదా? బ్రిటిష్ఇండియాలో ఇంగ్లీషు రాజభాష. దానిలో మాత్రం గులామీ వాసన లేదనవచ్చును. అదియే నిజమైన చక్రవర్తిభాష. "మా ఇంగ్లీషులో తప్ప ఇతరభాషలన్నింటిలో గులామీ వాసన వస్తున్నది" అని ఇంగ్లీషువారుకూడా అనజాలరు. వారిలో ఎట్టివ్యక్తియు ఇట్టి అల్పప్రసంగాలను జారవిడువడు. అట్టి ఇంగ్లీషువారుకూడా బ్రిటిషిండియాలో బళ్ళలో ఇంగ్లీషుకుహద్దేర్పరచినారు. కచ్చేరీలలో ఇంగ్లీషుకు హద్దేర్పరచినారు. డిస్ట్రిక్టులలో, న్యాయస్థానాలలో, రెవిన్యూలో, లోకల్ఫండులో జిల్లాభాషకే ప్రాముఖ్యతనిచ్చినారు. అదేవిధంగా హైద్రాబాదురాష్ట్రంలో ఉర్దూను కచ్చేరిభాషగా, ఉన్నతభాషగా నుంచిన నుంతురుగాక. బళ్ళలోను, కచ్చేరీలలోను ముల్కీభాషలకు బ్రిటిషిండియాలో జిల్లాభాషలకేస్థానమిచ్చినారో, ఆ స్థానమిచ్చుట అవసరము. ఆకోరిక నే తెనుగు కన్నడీ, మరాటీలును, ఏండ్లతరబడి ప్రభుత్వంవారితో చేతులుజోడించి మనవిచేసుకొనుచున్నారు. ఆకోరిక నెరవేరేవరకు ఇదేవిధంగా మనవి చేసుకుంటూనే యుండగలరు.

తెనుగువారును, మరాటీలును, కన్నడీలును తమ సంస్కృతిని చంపుకోనొల్లరు. గులామీ సంస్కృతి అనునదుండినను అట్టిదానిని అవలంబింపనొల్లరు. డాక్టర్ రజీయుద్దీన్‌గారు చెప్పినట్లుగా తమ మాతృభాషను వదలుకొని అది పట్టుపడనిదే పరభాషల గులామీ చేయనొల్లరు. శిశువులకుతల్లిపాలు ఇప్పించక "గొల్లభామగురుతు గడ్డపాలు" హార్లిక్సుపాలపొడి, గ్లాక్సోడబ్బా పొడి యిప్పించిన లాభకారిగా నుండదు- అదే విధంగా, రాష్ట్రవిజ్ఞానశిశువులకు తెనుగు, మరాటీ, కన్నడీ, మాతృదేవతా స్తన్యమునువదలించి ఉర్దూపాలనునోళ్లు తెరిచిబలవంతంగా దిగమ్రింగజేసిన అవి అజీర్ణం కలిగించి రోగాలు తెచ్చును. తమమాతృభాష తమకెట్లు హితవో ఇతరులకును వారి మాతృభాషలు వారికి హితవు అనుసంగతిని ఉర్దూ వాదులు ఎరుగరా? ఎరుగుదురు. కాని...............

## కొత్వాలీ నివేదిక

౧౩౪౮ ఫ. నగరకొత్వాలీ నివేదికను కృతజ్ఞతతో అందుకొన్నాము. నవాబు రహమత్‌యార్‌జంగ్ బహద్దరు కొత్వాలుగారి ఆధిపత్యములోజరిగిన యీ సంవత్సరపు పోలీసుయేర్పాట్లు ప్రశంసనీయముగా నుండుట ఒక విశేషము. రాష్ట్రంయొక్క దురదృష్టమువల్ల యీ నివేదికా కాలములో మూడు విధాల సత్యాగ్రహాలు, హిందూముస్లింఅల్లరులు, జరిగెను. అట్లుండినను కొత్వాలీవారు మంచినిగ్రహంతో పని తీసుకొన్నారు. హిందూముస్లిం అల్లరులలో ౮ మంది చచ్చిరనియు ౮౭ మంది గాయపడిరనియు తెలిపినారు. ఈసంబంధమగు గొప్ప నేరాలు ఇంకను విచారణలో నున్నవనియు తెలిపినారు. ముందునివేదికలో ఇప్పుడు విచారణలోనున్న కేసుల వివరాలు ఇచ్చుట చాలా అవసరం. నగరంలో మోటారు ప్రమాదాలవల్ల చనిపోయి దెబ్బలుతగిలినవారి సంఖ్య ౧౩౪౭ ఫసలీకన్న యీనివేదికాకాలములో చాలా తక్కువగానుండినదనిన నగర పోలీసువారీ విషయంలో మంచిశ్రద్ధ వహించినారనవలెను. హైద్రాబాదువంటి ఇండియాలోని యితరనగరాలలో అనగా బొంబాయి, కరాచి, మద్రాసు, కలకత్తాలో ఇంకను ఎక్కువ ప్రమాదాలు జరుగుచున్నవి. అట్టిపట్టీలనుగూడ యీ నివేదికలో తెలిపియుండిన జనులకు తారతమ్యము తెలిసిపోయియుండును.

నవాబు రహ్మత్‌యారు జంగుగారి కొత్వాలీ కాలములో పోలీసుశాఖలో మంచిమంచి సంస్కారములు జరుగుచున్నవని విని మేము వారి నభినందించుచున్నాము. నివేదికతుదిలో ఈ వాక్యం కలదు. "పోలీసుశాఖలో ఎక్కువ ఉపయుక్తతను మంచి శిక్షణమున్నూ నిష్పక్షపాతబుద్ధిని కలిగించుటలో కావలసినంత శ్రద్ధతీసుకోబడినది". ఇవియే పోలీసులకు కావలసినట్టిగుణాలు. ఈగుణాలు అధికారులలో బాగాఉంటే చిల్లరజవానులలోనునుండును. వారిలో లోపించితే క్రిందివారిలో మరీలోపించును. సాదీగుల్‌స్థాన్‌లో అన్నట్లుగా "యజమాని కోడిగ్రుడ్డను వెట్టిబట్టితే అతనిసేవకులు కోళ్లనెమాయంచేయగలరు". అటు గాకుంపుటకై నవాబ్ కొత్వాలు బహద్దరుగారు చేయుచున్న కృషికి మేమువారిని అధికంగా ప్రశంసించుచున్నాము.

## రాయలసీమను హైద్రాబాదులో కలుపుట

(మా రాయలసీమ ప్రత్యేక విలేఖరుడు)

సుమారు ౧౫౦ సంవత్సరాలక్రిందట కర్నూలును ఇంగ్లీషువారులాగుకొనిరి- అంతవరకు పూర్వం కర్నూలు నొకనవాబు రాజ్యంచేస్తుండెను. కడపనుకూడా ఒకనవాబు రాజ్యం చేస్తుండెను. గుత్తి కొకనవాబుండెను- ఆదోనికొక చిల్లరనవాబుండెను- కర్నూలును కొన్నాళ్లు గద్వాలరామారాయనింగారు రాజ రాజ్యంచేసెను-అంతకుపూర్వం కర్నూలు-కడప అనంతపురం బళ్ళారిఅనే నాలుగుజిల్లాలు నిజాంసర్కారుకు లోనైయుండెను- ఈనాలుగుజిల్లాలను నిజాంసర్కారు సైన్యంఖర్చులక్రిందికిగాను బ్రిటిషుకుంఫినీబహద్దరుకు (ఈస్టిండియాకంపెనీకి) యిచ్చివేసియుండిరి- అందుచేత ఈనాలుగుజిల్లాలనుఇంగ్లీషులో "సీడెడ్‌డిస్ట్రిక్టులు" అనివ్యవహరించిరి- ఈపదాన్నే తెనుగులో అడ్డాదిడ్డిగాతర్జుమాచేసి "దత్తమండలి" అని వ్యవహరించిరి- ఈమండలాలు దత్తుపోవడమేమిటిఅని ఈమండలాన్ని ఇటీవలరాయలసీమఅని పేరుపెట్టినారు- అనగా కృష్ణరాయ రామరాజాది చక్రవర్తులు ఏలిన కేంద్రస్థానంఅని అర్థంవచ్చుటకై యీనామకరణం చేసిరి- ఆపేరే యిప్పుడంతటను వ్యవహరించుచున్నారు.

× × +

ఇటీవల అనగా యీ రెండుమూడునెలలలో మీహైద్రాబాదులో క్రొత్తక్రొత్త సిద్ధాంతాలు లేవదీసినారు- పూర్వకాలంలో నిజాంసర్కారు పోగొట్టుకొన్న ఆస్తిపాస్తులన్నింటిని వాపసులాగుకోవలెనని హైద్రాబాదలో ఒక మహమ్మదీయసంఘం ఘాటైనతీర్మానాలు చేసిందని విన్నాము- పత్రికలలోనుచూచినాము- అయితే ఒకప్రశ్న బయలుదేరుతుంది- పూర్వంఅంటే ఏది హద్దు- అంతకుపూర్వం కాయకూడా బయలుదేరవచ్చునాలేదా? ఇతరదేశసంస్థాన ప్రభువులుగూడా ఇదేవిధంగా గొంతెమ్మకోరికలుకోరితే అవి సఫలమైతే ఇకఆదేదో ఇక్కడెన్నిరాజ్యాల కుమిని యీరాజ్యాన్ని అనుభవించే ఇండియాభూభాగం యొక్కడవుంటుంది? ఇ

వరియింకోప్రశ్న. ౧౯౩౬లో ఒట్లసకమిటీవారు దేశీయ సంస్థానాల హక్కులను విచారించిరి- అసమయంలో యీ రాయలసీమను నిజాంసర్కారు కివ్వాలని ఉద్దేశముతో మావైస్యాన్ని మేము తెలిపికొనుకుంటామంటే మీనిజాంసర్కారువారుఅయితేకపోయిరి. మాకు రాయలసీమ అవసరంలేదని, వారు, సైన్యం ఉండేలేరాలేఅన్నారు, ౫ ౧౦ గిడ్డలో నేమున్నీ అభిప్రాయంపూరించిందా. ... దు. పాపం ప్రభువులు ... అన్నపాపానపోలేరు ఇదంతా ... లోని ముసల్మాను అంజుమనువారంటున్నారు- ఇదంతా యుద్ధఫలితం అని తోస్తున్నది- లేకుంటే యింగ్లీషువారు ఘోరమగుయుద్ధంలో నుంటె ఈసవాళ్ళతో నేమిప్రయోజనం-

ఈ రాయలసీమలో హిందూముసల్మానులు ఇంతవరకు ఐకమత్యంతో ఉన్నారు- ఇక దానికి భంగంకలిగే లక్షణాలు సిద్ధమగుచున్నవి. ముస్లింలీగుశాఖ లేర్పడుచున్నవి- రాయలసీమలో కొందరుముసల్మానులురాయలసీమను హైదరాబాదులో కలుపుతామని ప్రయత్నాలు చేస్తున్నారు-

... ... ...

బషీర్ అహ్మద్ సిద్దీఖీఅనేఆయన మా రాయలసీమలో ముస్లింనాయకుడట- ఆయనపేరు చాలామందికురకలకే తెలియదు- ఆయన హైద్రాబాదుకువెళ్లి యీఆలోచనలు చేస్తున్నారట-

నవంబరునెలలో ముస్లింరాజకీయసభ రాయలసీమలో చేస్తారట- దానికధ్యక్షులు డాక్టర్ సయ్యద్ అబ్దుల్ లతీఫుగారు- వీరు మారాయలసీమవారే- కర్నూలుపట్టణానికి ౧౮ మైళ్ళదూరంలోఉండే ఉల్చాలఅనేగ్రామం వీరి జన్మస్థానం వీరిబంధువులు. తల్లిదండ్రులు ఇచ్చటనే ఉండునట్టివారు- వీరియిల్లుకూడా ఈ ఉల్చాల గ్రామంలోఉన్నది- లతీఫుగారు పాకిస్థాన్ కదిలించినవారిలో ప్రథములు- వీరిఆయకత్వములో ఈసభజరుగుట వీరువ్రాసిన పాకిస్థాన్ గ్రంథములో సూచించినట్లుగా దక్షిణదేశంలో హైద్రాబాదుసంపూర్తి ముస్లిం కేంద్రంగా మార్చడానికే యీప్రయత్నాలన్నీ అని స్ఫురించకమానదు- ఈసభ బహుశః ఆదోనిలో చేయవచ్చును- ఎందుకంటే ఆదోని ముస్లింలీగుశాఖవారే యీతీర్మానాన్ని చేసినవారు-

... ... ...

ఈప్రయత్నాలకు నాందిగా మీరాష్ట్రంలో మతప్రచారంచేసే పేలవారిజనులకు తురకలనుగా చేసిననవాబు బహద్దరుయార్జంగు ఆకేవారు మా రాయలసీమలో ౫ దినాలపాటు సంచారంచేసి ఉపన్యాసాలిచ్చి గందరగోళంచేసి పోనున్నారు- వారుగొప్ప వక్తలట! మంచిఉద్రేకంతో వస్తేవారట! భారీమనిషట! అరబ్బీ, ఫార్సీ, ఉర్దూలో గొప్పమాల్వీలట-జాగీర్దారులట- ఇన్ని లక్షణాలుండేవారు ఏమిచలిస్తే ఏమికానేరదు-

## బెజవాడ బందరు నైజాంలో చేరాలట

బెజవాడ, సెప్టెంబరు ౧౦

ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం కోరుతూఉంటే, రాష్ట్రంసిద్ధించే అవకాశాలు కాంగ్రెసువైపుననైనా ప్రభుత్వంవైపుననైనా అనుపడకుంటున్న స్థితిలో ముస్లింలీగువారి ప్రచారంచూస్తే "కొండనాలుకకుమందువేయగా ఉన్ననాలుక ఊడే" స్థితి వచ్చేటట్లున్నది.

నైజాంరాష్ట్రమునందు నివాసమున్న ప్రముఖులును అఖిలసంస్థాన ముస్లింలీగుఅధ్యక్షులును అగు నవాబు బహదరుయారుజంగుగారు మచిలీపట్టణపువారు, యీపూరులోదిగి రాగానేమాటల్లోగం ధాలయమునందు బుధవారం సాయంకాలం జరిగినసభలో గావించిన ఉపన్యాసంలో ఈ దిగువ రీతి పలికిరి.

"నైజాంరాజ్యమునందలి ఒక్కొ అంగుళమైనా బ్రిటిషువారు భుజబలంతో జయించిందికాదు. వారికిమేము సర్వదా తోడ్పడుచు, ఉత్తర సర్కారులు దత్తమండలములు బేరారులను వారిసైన్యము నుంచినందుకుగాను కట్టకిచ్చితిమి. యావద్భారతదేశములో బ్రిటిషువారు నేటిస్థితికుంటుటకు మాసహాయమేకారణము. అనేకశతాబ్దములవరకు భారతీయరాజకీయములందు హైదరాబాదు గొప్పశక్తిగానుండెను-మరియుద్ధమునందు, యీయుద్ధమునందు మేము బ్రిటిషువారికితోడ్పడినందుకు, ప్రాతఒడంబడికలను గౌరవించి అదివరకు మారాజ్యభాగములన్ను తిరిగియిమ్మని బ్రిటీషువారినికోరకలేమా? బెజవాడ, మచిలీపట్నం మావి? మీరంతా ముస్లిములీగులో చేరి జిన్నాగారి పాకిస్తానుస్కీమునకుతోడ్పడినచో యివన్నీ మనం తిరిగి సంపాదించగలం. మనము ఇంగ్లీషువారి మిత్రులము: యికముందుకూడ ఆప్తులముండుము- ఇంగ్లీషువారన్న మాకుభయంలేదు- హైదరాబాదు ఎవరికిలోఎక స్వతంత్రంగా నుండాలనే మేముకోరుచున్నాము- ఇండియాను కేవల స్థానికమస్తిలకు యిస్తామనుకోండి: అప్పుడు హైదరాబాదుస్థితిఏమగును? అందువలన గోల్కొండరాజ్యభాగములను తిరిగిచేర్చి హైదరాబాదు స్వతంత్రరాజ్యముగ నుండవలెను- ఇదిముస్లింలీగు ఐకమువల్లనే సాధ్యమగును." (ఆంధ్రపత్రిక)

